# MADHURI DARSAN

by

Rayaprolu Subbarao

A Hymnic offering to

SREE SATAVADHANI

CHELLAPILLA VENKATA SASTRI

THE POET-LAUREATE with THE GOVT. OF MADRAS

***Dr. Sir C. R. Reddy, M. A., (Caniab). (1913)***

Though I have not known Mr. Rayaprolu-Subba Rao personally, I have been in touch with his correspondence, common friends, and above all his own splendid writings in prose and verse. He holds a high rank amongst modern Telugu poets, and I think he is almost entitled to be acclaimed as the founder of a new school of poetry, which is bound to mark a new epoch in the development of Andhra Literature. His imaginative gifts are of a high order and his power of phrase is remarkable, almost unique.. He will bring name and fame to any institution, with which he may be connected.

***Prof: Sir S. Radhakrishnan.***

I have known Mr. R. Subba Rao for some years past and have learnt to admire him both as a man of high ideals and author of remarkable powers. His familiarity with English Literature and criticism gives him ample advantage over his colleagues in the field of Telugu Literature and he has not been slow to utilise it. His poetic soul, saturated with the best of Indian Culture and Western thought, has found for itself new models of expression, and it is fairly safe to prophesy that his work will mark an epoch in Telugu

Literature. He has placed the Andhra World under a supreme debt of obligation by his substantial and unique contributions to its literature and we hope that he will continue to enrich it.

***Mr. Jayant Ramayya Panulu* B. A. B. L. *President Telugu Academy.***

I have read with much delight the beautiful poems of Mr. R. Subba Rao. Some of his works are modelled on the best English Lyrics and it is no exaggeration to say he has creditably succeeded in his attempts.

"Thrina Kankanam" is a fine production in this direction. Its sentiments are chaste; language is polished and poetry of a very high order. This small poem purports to mark an epoch in the development of Telugu Poetry, which would be welcomed by all lovers of Telugu Literature. I hope he has a brilliant future.

***Mr. W. W. Pearson.* M. A., M. SC. *Shanti Niketan***

Mr. Subba Rao has been with me a sweet name and I can never forget it. As a poet and friend, I have moved with him closely and have been always struck with many latent virtues of his soul and genius. He is unpretending and silent. It is not very often that we come across

young men of sterling worth, but yet curtained in colourless modesty.

***Mr. C. R. Reddy Vice Chancellor, Andhra University, Waltiar (16-8-'40)***

I have been reading the Jubilee Edition of your works which you were so good as to present to me at Hyderabad. They are a marvel of our literature so fresh, powerful and impressive. Your contributions to Telugu will live– live long and charming, a perennial source of joy and inspiration. Keep up.

With Kindest thoughts.

***Mr. C. R. Reddy. Waltiar (6-9-1940)***

I forgot in my last letter to add a special word of praise on your translation of Omar Khayyam into Telugu. It reads well and reproduces the Fitzgeraldian spirit in no small measure. Considering how difficult it is to translate a piece so couched in symbols and allegorical language, you have done exceedingly well.

*With best regard.*

# మాధురీ దర్శనమ్

రాయప్రోలు
సుబ్బారావు



వినీత సమర్పణము

శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి

శతావధాని, కళాప్రపూర్ణ,

ప్రభుత్వాస్థాన మహాకవికి

సాహితీ సమ్మానక్రతుకలాపాంకము

విజయవాడ. తేది..............................

ఓమ్

శ్రీ వేంకట కవి కులపతి
జీవాతుర రమ్యామ్నై, రసీభవదంధ్రి
శ్రీవని చిగురెత్తించిన
ఆ వాఙ్మయ మాధురీ లహరికి విజయముల్.

ఉభయ పరిష త్సుధీ ప
ట్ట భద్రుడై వెలయు వేంకట కవీంద్రగురు
ప్రభుపాదున, కస్మద్వా
గభినవ కాదంబినీ పయః పాద్యంబుల్

భువన శివేతర భంజక
నవనీతపదార్థ రంజనన్ నిండిన దీ
కువలయ సుందరభాండ, మ
నవద్యము, కళా పరిపూర్ణ నైవేద్యముగాన్.

రా. సు.

ఓం

# మాధురీ దర్శనమ్

చేరగ చాతకములు రస
పారణకయి, కేళులు సల్పు వాకిండ్లను సిం
గారించెడి శుక్లాంబర
చారు పయోధరకలాప సౌభాగ్యంబుల్. 1

వర్ణాత్మక మగు శబ్దకు
లార్ణవము తరంగశయ్యలయి, చిద్గగనా
కీర్ణామృతాంశు పులకిత
పూర్ణార్థములై, ధ్వనించి పొంగులు పోవున్. 2

వేద పురాణ విలక్షణ
వాదన మయి, హ్లాదరస్యమై శారద్యా
పాదన మయి, సుకుమారా
స్వాదన మయి, సాహితీరసము భాసించున్. 3

మత్యమరాచార్య సర
స్వత్యాధ్వర్యవమునకు నిబద్ధాంజలినై,
సాత్యవతేయ స్మృతి సాం
గత్యవచోముఖికి ముఖికి కరములు మోడ్తున్! 4

౧

హాల గుణాఢ్య ప్రముఖ కవు
శీలవు లభిజన నిసర్గ శృంగారంబున్
గీలించి, రఖిల సహృదయ
లీలాశయ లాలనా లలిత భంగిమలన్. 1

తొలివెన్నతోడ మురిగిన
యలవాటిటు ఆంధ్రజాతి; కానందపథాం
చలమున నిలిచెను లక్ష్యము;
లలితము కాదో తదీయలక్షణముఖముల్ ? 2

అక్షరరమ్యత నెఱిగిన
దక్షుడు, రుచిరార్థసూక్తిధాముడు, వాచా
భిక్షువుల కొసగె భారత
చాక్షుషసూత్రమ్ము నుభయచరితార్థముగన్. 3

రస మది యథాతథమ్ముగ
ప్రసరించును కవులపాటవము కొలది యనెన్;
గ్రసితాఖిల శబ్దబ్ర
హ్మ సమజ్ఞాపరుడు నన్నపార్యుం డాదిన్. 4

రసరూపము బ్రహ్మానం
ద సధర్మ శ్రీమయముగ ధ్యానించి, అతం
డసదృశ మధురగ్రథన
ప్రసన్నముగ తీర్చె తెనుగుభారత పంక్తిన్, 5

ఇటువంటి శబ్దమహిమా
పటిష్ఠుల తపోవరేణ్యా వైదగ్ధ్యములన్
స్ఫుట మయ్యె, నాంధ్రవాణీ
నటనాపూర్వప్రయోగ నవ్యనిపుణిమల్.

స్వస్థాన వేష భాషా
సుస్థిత సౌందర్యలుబ్ధ సుమనసు లీయాం
ధ్ర స్థానీయులు; పాషం
డ స్థండిలరుచులు వీరలకు నింపవునే ?

పామర పండిత కుల ముఖ
కోమల మగు వైకృతానుగుంఫిత ఫణితిన్
ప్రేమించి, అన్యభాషా
ప్రాముఖ్య మపాకరించి, రాగిలి రాద్యుల్.

అమృత రసోపాసకులై
శ్రమించిరి మహాంధ్రకవులు శబ్దబ్రహ్మాం
డమునన్ సౌందర్యావర
ణమునం దానంద సాధనం బయి వెలయన్.

## ౨

అతిసంఖ్యాక, మనంతము,
అతీతమేధాసుపక్ష, మగు నీ మనుసం
తతి తనిసెను నానావ్రత
గతిగ సేవ్యోపాసనాప్రకారముల బుధా! 1

కలుగఁడె కుసుమమ్ములను కు
వలయ కమల కుంద భిన్నవర్ణము, నానా
విలసనగుణవైభవ, మ
ట్టులె వైవిధ్య మగు మనుకుటుంబమును బుధా! 2

శ్రుతులును, స్మృతులును, శాస్త్ర
ప్రతతియు, నాచారధర్మబంధంబును, సం
స్కృతము లయి వెలసె, మను సం
తతిశోభన మొకటె లక్ష్యతత్త్వముగ బుధా! 3

జ్ఞానోపాసనలకు, క
ర్మానుష్ఠానములకు, నితరాధ్యాత్మిక సం
ధానముల, కేది స్థానము!
మానవజీవితము గాక మహిలోన బుధా! 4

లౌకిక కామితములకు, న
లౌకిక పరమార్థ సిద్ధులకును, శరీరం
బాకర మాద్యము నగు నని
వాకొని, రస్మత్తపోవిభావసులు బుధా! 5

సామము పాడుచు త్రావిరి
సోమము స్వర్లోకకాంక్ష నుడియగ; మన మా
తామహ పితామహ ప్రపి
తామహు, లానందవల్లి తలిరింప బుధా! 6

ఉపనిష దుపాసనల బడి
తపియించిరి బ్రహ్మతత్త్వతత్పరదీక్షన్ !
అపవర్గధర్మసూత్ర
వ్యపదేశము విప్పిరి 'అహ మస్మి' యని బుధా! 7

యమియించి రింద్రియముల ని
యమించిరి ప్రవృత్తిధర్మ, మైహికవైము
ఖ్యము పెంచి 'రకాస హాత'
ప్రమాణము వరించి యోగబంధమున బుధా! 8

సహజ పరిణామమును ని
గ్రహించి దమియించుటో! సుకౌశలకర్మో
ద్వహనానువృత్తి జీవిత
విహిత మనుష్ఠించుటో! అపేక్ష్యంబు బుధా! 9

బహుళకఠినాసిధారా
సహనముసాధన నయింపజాలిరి; కాంతా
సహకారధర్మలీలా
వహ మగు అద్వైతమిథునబంధంబు బుధా! 10

లవిలుంపకుమి ప్రజాంతం
తువు! నను శ్రుతిశాసనము మిథునబంధమహా
సవనోత్సవమున గా, కెటు
లవు పాలింపంగ మానవావళికి బుధా! 11

విమలబ్రహ్మాధీనత
రమింప నగు నిర్వికల్పరత్యామృతరుచుల్,
సమాధిక మిథున ప్రేమా
గ్రమహోదశ ప్రతిఫలింప గాంచనగు బుధా! 12

తెలుపరె గార్హస్థ్య ప్రవి
మలీమసములు లయినకర్మమధురిమలు! తద
స్ఖలిలోత్తరభావాంత
ర్వ్యాలయము వాచామగోచరం బనిరి బుధా! 13

యమ నియమ విధి నిషేధ
క్రమశాసిత మయిన ధర్మకల్పముకంటెన్;
రమణించె విలక్షణ మయి
ప్రముదిత వాఙ్మయ తపశ్చరణరీతి బుధా! 14

బహుయుగ యుగాంతరంబుల
మహర్షికుల సాధనాసమందిత తేజో
నిహితం బైనది, భారత
మహానీయ జ్ఞానభాగ్యమండలము బుధా! 15

ఏతన్మహనీయానుభ
వాతతనిక్షేపనిధులె అందెను మనకున్,
గీతచ్ఛందోరూప
జ్యోతిర్మయ వాఙ్మయముగ స్రుతు లీన బుధా! 16

ఎవ రీయమృతాక్షర క
ల్ప వసుక్షేత్రవలయమును వర్జింతురు? మా
నవసంస్కృతి జీవద్వై
భవ మవిభాజ్యరసవత్ప్రవాహంబు బుధా!

సుకుమారులు సుఖచారులు
సుకృతులు సుమనోవినోద సులభులు శిషో
క్రకచము నోర్వరు; లాస్యా
త్మక సంభ్రమ మోర్తు రభిమతం బగుట బుధా! 18

తీయని యీసాధన, మన
పాయముగా ననుపజాలు వాలకము ఉపా
దేయం, బభినవకవితా
ప్రేయస్సంవరణ తరుణావృత్తమున బుధా! 19

3

అవ్యక్తము, నిత్యోత్సవ
నవ్యము, లలితావలోకన స్నేహాజ లీ
లా వ్యతికలితము, నగు నొక
దివ్యాంశ స్ఫురించెడి ప్రకృతిముఖమున బుధా! 1

బీజచ్ఛేదము కాని మ
హోజోవిద్యుత్తరంగయుక్తం బగు నీ
రాజచ్చైతన్య, మమృత
భాజన; మది నిత్యనవ్యభాసురము బుధా! 2

పరిపూర్ణ కాదె! ప్రతి వ
త్సర నవవర్షోదకోపసంపన్నంబై
హరిచరణ మార్జనామృత
చిరజని యగుగంగ; మహిమ చెడిపోక బుధా! 3

తొలిచూత మె యీనాడును
ఫలియించెడి ననుచు చెప్పవచ్చునె వసుధన్ ;
ఫల బీజ పరంపరలో
విలక్షణ పరిణతి కానిపించు గద బుధా! 4

ఋతువున కొకరుచిరాలం
కృతిగా సవదరించి, యభినయించెడి సృష్టి
స్థితి లయ యోగిని, ఆనం
ద తనూతారుణ్యారోచనము గాగ బుధా! 5

కలదెందో నిత్యసుందర
లలితాలంబన, మనంతలావణ్యా సము
జ్జ్వలహాస్త మొకటి; తన్మం
గళాభినయరూపణంబె కావ్యకళ బుధా! 6

శుక్లాంబరాభరణ, బ్రి
హ్మ్ర క్లేశాపహారణ, శ్రుతిమానస కాసా
ర క్లిన్నతరుణచరణమై
ఆక్రాంతసువర్ణజగతి కధిరాజ్ఞి బుధా! 7

౪

శ్రీసృష్టి నక్షయములై
భాసించెడి ప్రకృతి భూతపంచకము; తదీ
యాసదృశ మేలనా వి
న్యాసమె బింబించు మానవాకృతిని బుధా! 1

ఈమానవ వృత్తంబును
మీమాంసించిన మహర్షి మిహికాంశులు నా
నా మార్గము లరసిరి: అం
దీమధుర పథంబు వాగభీప్సితము బుధా! 2

కవితా రసాలమున ప
ల్లవించె శబ్దార్థపిచ్ఛిలస్వర కల్యా
ణ వివర్త; మిదియె కాంతా
నవగీత ప్రీతిదర్శనం బందు బుధా! 3

వాగర్థవిశ్వముఖమున
భోగింపగ నగు, ననంతభూతంబులలో
రాగిలు ప్రణయ మధు హావి
ర్భాగము; సహృదయ జనానుభావ్య మిదె బుధా! 4

హితభావజీవనం బయి,
శ్రుతిశోభనకంఠమై, తరుణకాంతా స
మ్మిత మగు నీయభినవ సా
హితియు మధురభువన జీవితేశ్వరియె బుధా! 5

ఈభూతచక్ర మందున
శోభిల్లెను మానవుండు సూక్ష్మగ్రాజ్ఞా
లాభోదయమున, ప్రేమ
ప్రాభవ మనుభూతి నెఱిగి పాడంగ బుధా! 6

స్త్రీ పుంసయోగసిద్ధి క
లాప మ్మగు జగము మంగళాలంబనము
దీపితము చేయ; మాధు
ర్యోపాసకు లయిరి సుకవు లుర్విపయి బుధా! 7

ఈ సృష్టి స్థితి లయ వి
న్యాసము నానందమూల మని రుపనిష ద
భ్యాసకు, లేతత్ప్రాప్య వి
ధా సాధన సాహితీవిధాయకము బుధా! 8

ఆనందభానుమతి, విబు
ధానంద పదార్థఫల రసాలసశాఖా
సూనవతి, బ్రహ్మసతి, వి
జ్ఞానోధ్య స్తనవతి, సాహితియె బుధా! 9

మధురాక్షర చారిత్రిన్,
సుధాతనుబ్రహ్మసుముఖ సుందరగాత్రిన్,
కథనదరివార్ద్రికంఠ
ప్రథిత కవిస్తోత్రపాత్రి భావింపు బుధా! 10

క

మన సఖిలేంద్రియములలో
సునిశితబల మగుచు యోగశోధనలక్ష తే
లెను ! యౌవనాత్మనవ బం
ధన మోక్షణములకు కారణం బదియె బుధా ! 1

విరస వికార విరుద్ధ వి
పరీతము లగువిషమానుస్వరసలసిరం
తర వికలీకృతమై ని
ష్ఠురనైజము నందు మనసు శుచి తొలగ బుధా ! 2

అది విశ్వతోముఖ ప్రియ
మృదుమధురాలోక పారమితసాత్వికమై
పొదలును నిత్యసుమంగళ
సదమల సాంగత్య లగ్న సాధనగ బుధా ! 3

కలదొకట దుర్విపాకము,
కలదింకొక్కెడల విశ్వకళ్యాణవిధా
కలనము, ఈప్సితశిక్షా
బలపరిణామ పరిపాకభాగ్యమును బుధా ! 4

మానస మది సంకల్ప
స్థానంబై సకలపరుషసరళ విభావో
త్థానపద మగుట, తదుపా
దానమ్మృదూకరణ మాద్యధర్మంబు బుధా ! 5

మనన మహోమధుర పయో
ధి నిమగ్నోన్మగ్నము లయి తియ్యములై తే
జిన మానసరేఖలు మా
ర్చును సర్వమును విహితైకసుముఖముగ బుధా! 6

తెరలి ముసలిన పయస్సులు
మెఱుగారుచు నురుగులాఱి మీఁగడ యగు మా
దిరి స్థాయిభావ మందెడి;
తరుణాంతఃకరణ నైజధర్మములు బుధా! 7

ఈ యావరణాంతర మన
పాయముగా తొలగిపోయి బ్రహ్మానంద
స్థాయి ప్రాపక మగు నా
ప్యాయపథము సాహితీతపఃపరము బుధా! 8

౬

ప్రియమును, హితము, ననుద్వే
గ యుతము నగువాక్యము; అధిగత కవికంఠం
బయి, మానవులకు ప్రేమా
ధ్యయన ప్రతిపాదసూత్రము నిల్చె బుధా ! 1

హిత మఖిలప్రాణుల కభి
మత మగుటను, విశ్వ మెల్ల మంగల్యానయ
ప్రతిమా రూపకముగ సా
హితీ కుశీలవులు అభినయించెదరు బుధా! 2

శ్రోత్రద్వారము లొకటను,
నేత్రకవాటము లొకటను నిత్యముగ బహి
శ్చిత్ర జగచ్చైతన్యపు
మైత్రిని నడపెడి యథాప్రమాణముగ బుధా ! 3

ధ్వనివలయ సహస్రగతుల
ననుసంధించును శ్రవణము; లాకర్షించుఁ
కను లీయఖండసృష్టి
ప్రణిహిత విద్యుత్స్వరూపరంజనము బుధా ! 4

విగళితముఖమై శబ్దము
తగిలెడి అర్థమును వధువు ధవునివిధమునఁ;
జగ దఖిల బాహ్యాంతర
సుగతులుగాఁ తన్మనోజ్ఞసుఖ దాతులు బుధా! 5

ఏ తన్మంగల్య మహా
చైతన్య స్పందకళలు, శబ్దబ్రహ్మం
జాతోద్వర్ధనులయి, నవ
నీతరుచుల సాహితీ ఫణితిగొనియె బుధా! 6

తేనె కొలంకున పెరిగిన
దీనవనీతాభిజాత్య, హృదయంగమ శిం
జానశ్రీపద పల్లవ,
జాను తెనుగుతల్లి నుడికి జయమగును బుధా! 7

౭

అతినగ్న శుద్ధమః అ
ప్రతిబంధ క్రీడనాభరణమయిన అసం
స్కృతశైశవమున, రతి అవి
కృతమగు; సపరిగ్రహావహితమాట బుధా! 1

ప్రాణుల కెల్లను సర్వాం
గీణమయి విలసిలు రతి; అకల్మషమయి క
ల్యాణ పరమవర్చస్క ధు
రీణమ్మగు స్థాయి, నది సరించు నెటు బుధా! 2

తరుణోదయ విద్యు ద్వ
ల్లరీ సముల్లాస మంగళపయోధర సుం
దర మగు నూనువయసున, రతి
పౌరయుక్ ప్రణయార్చనాభిముఖరక్తి బుధా! 3

తరుగక, విరుగక, చెఱగక,
చిరకాలస్నేహవైర శీతోష్ణపరం
పరలన్ చెదరక, నిర్జర
పరిణతి గొను రతియు మిథునబంధమున బుధా! 4

నరనారీ సంహితమై
స్ఫురదంతఃకరణ ధర్మచోద్యం బగు, త
త్పరమప్రాప్యంబునకై
నిరంతరాన్వేషణలు చనెన్ మున్నె బుధా! 5

లౌకిక నిషేధ విధి హాని
తాకని నవబాల్యజీవ తారుణ్యకలల్
పాకె మగు, బ్రహ్మచర్యా
ప్రాకర్షికనియతి మిథునభాక్తముగ బుధా! 6

ఏతదవస్థా ఫల బల
జాతము మదమూర్తమై, విషయాతిభార పరా
భూతము కాకుండగ, నవ
నీతముగా మారుపథము నెమకవలె బుధా!

నరనారీసంబంధము
పరిభావింపుము దిశావిభాగమువరుసన్
ధర : జననీ భగినీ సహ
చరీ కుమారీక్రమము నిజం బగుట బుధా! 8

తూరుపు పడమర కాని ప్ర
కారము, దక్షిణ ముదీచి కానివిధమునన్.
మారవు తదీయబంధము
లారంభ సమాప్తదశలయం దెందు బుధా! 9

౮

అంగజ ధర్మకలాప త
రంగిణి. నానావిభావ రచితాద్వైతో
త్తుంగ మయ్యి, లీన మగు న
నంగ పరానందశోభనస్ఫూర్తి బుధా ! 1

తనురక్తములయి అంత
స్సున రాగిలి లేచుచు పడుచుఁ మేళనముగ
గొను చేతోద్రవరతులు; అ
తనుమథనమున తెఱలి అమృతములగును బుధా ! 2

ఋజువాచకు లగు కవి త
ల్లజు లుపలక్షించి రాగకళాతన్మయతన్,
నిజదేవభూయ మంది మ
నుజేంద్రియములు మెఱయు అతనుప్రమితి బుధా ! 3

యావత్సంపన్నం బగు
నీవిశ్వ, మనంతవస్తుభృత మయ్యును, నా
నా విధగుణగణధర్మ స
మావిష్కరణ ప్రయోజనాశ్రయము బుధా ! 4

ఆకలి పిపాస లార్పగ
నాకలములు, అంతరమున నవ్యక్తములై
శే కత్తై శ్రోత్రనేత్ర స
మాకీర్ణ కుతూహలస్పృహల్ పెనగి బుధా ! 5

వైశాఖదివస పులకిత
పేశలకలకంఠ మధురపికరుతి నిష్ట
ప్రాశన గాన శ్రవణేంద్రియ
తోషము; తమి కనునయంబు కుదిరినటు బుధా! 6

జగతీముఖ విలసన పా
రగ శోభాభాసిత మగు ప్రత్యూషరుచిఁ
గగురొత్త బనిసె నగాలు;
మిగిలెడి కను వేదుగల్ శమించంగ బుధా! 7

సురుచిరశబ్దములఁ సుం
దరరూపంబులను ప్రాణి తనియుటయె కళా
పరమరహస్యం; బిదె రతి
నిరీక్షితం బగు రసోపనిషదంశ బుధా! 8

రతి చిత్పదార్థ; మది పు
ష్పితమయి, స్త్రీపుంసయోగ చిరశిఖా స్నే
హితమై, సుమానుష భవ
కౌతుకల్యాణంబున కగు రమ్యముగ బుధా! 9

౬

రచనము కావ్యము; ఏత
ద్రుచిమద్బంధము రసస్వరూపబ్రహ్మ
భ్యుచితకళాచ్ఛందం, బే
రుచిర సముద్దీపనమున ప్రోది యగు బుధా ! 1

రమణీమూర్ఛ తరంగిత
కమనీయం బయిన కావ్యకంఠధ్వనిలో,
సుమమున మకరందమున లె
భ్రమించు రస, మఖిల భువనరక్తముగ బుధా ! 2

కవితకు రస మసువులు, తత్
కవనము భావప్రఫుల్ల కమనీయముగా
నవనవలాడెడి నుడువుల
సవరింతురు కవులు సుహృత్ప్రసన్నగతి బుధా ! 3

భావము సాహిత్యకలా
జీవము, తత్కామనీయసిక్తస్థాయీ
భావము రసోదయోపః
శ్రీ వాల్లభ్యమగును కవికృతియందు బుధా ! 4

సీతారాములు కానల
కాతరులై కన్నకష్టకార్యము లెల్లన్
నీతములై, సుకవిసరో
జాతములుగ, భావ మనిరి సహృదయులు బుధా ! 5

కార్యము శారీరకమై
పర్యవసించెను ఫలించి; భావము వాచా
ధార్యంబై అశరీర స
పర్యల కయ్యెన్ నవరసపరిణతుల బుధా! 6

అంగాంగిక పార్వణరుచి
సంగత తనుసౌష్ఠవంబు సౌందర్య మగున్;
శృంగార మాయె కృతుల అ
నంగ మ:ఋ తదమృత ధారణా స్ఫూర్తి బుధా! 7

ఈ కావ్యకలాపము; భా
వాకూతరసాదిరూప మ:ఋ, శబ్దార్థ
ప్రాకామ్యయోగసిద్ధిన్,
ఆకాంక్షాలోకపేయ మగు కృతుల బుధా! 8

౧౦

అభినవ శిరీష కోమల
ఋభురక్తులు సాత్త్వికార్ద్ర శృంగారకళల్;
శుభమింప, వవి ముదిసి ముది
రి భగ్నమైపోవు తనుకరీరమున బుధా! 1

వెన్నెడలిన పుండ్రేక్షువు
కన్నుల రస మారిపోవుకరణిన్, భుక్తా
పన్నచ్ఛిన్నాంగకముల
వన్నెగిలవు; రతిరసానుభవములును బుధా! 2

పసితనపు పాల మిసిమిడి
వస నెసగెడి పచ్చివయసు వాల్లభ్యములన్
కొసరి కొనగోఁ పాత్రిక్తను
విసర్జన మొనర్చు జీవి వేడుకనె బుధా! 4

ఈశ్వరభావము కద జగ
దైశ్వర్యం! బిందు జీవి కాప్యాయము వా
గీశ్వరు లుపలక్షించి, ర
నశ్వర మాధుర్యభావనానిరతి బుధా! 3

కాదంబినీ జరర తటి
దాదికమటు పరిగ్రహింప నగు సాహిత్యా
స్వాదుకళయు, సౌందర్య
శ్రీదాక్షిణ్యావధాన శిష్టగతి బుధా! 5

౧౧

ముఖ్యార్థ బాధకం బయి
ప్రఖ్యాతకవీంద్ర కంఠఫణితి ధ్వనించె౯,
వ్యాఖ్యాత లరసి, రట ఆ
లేఖ్యంబగు స్వాదనీను లీలాప్తి బుధా! 1

అసమర్థ వ్యాఖ్యాహి
గ్రసితము లయి మూర్ఛబడిన కావ్యపికంబుల్,
హసియించి పాడె, 'సూక్తి' ప
రసాభిషేక పటిమాపరామర్శ బుధా! 2

కవితా పితామహుండు ను
డివెను, 'బయలు గాక ద్రావిడీస్తనము లటుల్
కవితయు నఱచా టగు అం
ధ్రవధూటీకుచయుగములగతి తనరు' నని బుధా! 3

మనసున మొలకెత్తిన మొ
త్తని తీపులు మిగుల నున్నితము; లయ్యావి ప
చ్చనిపదముల పొదిగిళ్ళ౯
తనికెడి ముచ్చట్లు సంవృతము లాయె బుధా! 4

గూఢము హృదయంగమగతి,
గూఢత మీమాంస కంతకును మూల మగు౯;
గూఢము రసోదయస్థితి,
గూఢత తొలగ౯ జుగుప్స కోల్కొనదో బుధా! 5

చెయి తలగడగా విరహా స
మయాలస యయిన లలనను స్మరణకు తెచ్చెఁ;
ప్రియవాచకుం డయినకవి
'శయనించెను పద్మమందు శశి' యంచు బుధా!

పాషాణములును నవ పీ
యూషము పిదికెనట, నవనవోన్మేష ప్ర
జ్ఞా పాడబ మృదులీలా
భాషి జగన్నాథుతండ్రి పాఠమున బుధా!

మధుమద్రసాలకిసలయ
విధివశ కలకంఠమయిన పికతల్లజ మ
ల్లధికృత వాణీవీణా
మథితస్వరముగ్ధయయ్యె మన తెనుగు బుధా!

సమాప్తమ్